చా—అహహహా! మహాదొడ్డనవుకరు! చుట్ట ముట్టుకోవడానికే యింత సందేయిస్తూవున్నమనిషి భోజనమయినతరువాత మన యెంగిలి విస్తళ్లయినాతీసి వేస్తుందా? అవీ మనమే తీసుకోవలెనా?

చా—(తనలో) ఇతనికి కులస్త్రీలవిషయమయి యెలాగు మాట్లాడవలెనో తెలియదు. ఇంకొకమాటు ఇలా మాట్లాడితే నేను లోపలికి వెళ్లిపోతాను. (బిగ్గరగా) ఈయనకు మంచితీర్థము కావలెనేమో కనుక్కోండి.

గణి—చుట్టతాగినతరువాత పుక్కిలించి వెయ్యడానికి కావలెను గాని యీలోపుగా అక్కరలేదు. అయ్యా! ఆచార్లగారూ! మీకు భోగంమేళం అవశ్యంగా కావలెనుగాదూ! మీరు యిచ్చేకట్నం ఇందాకా చెప్పిన లక్షవరహాలేనా యీలోపుగా ఇంకా యేమయినా యెక్కువచేసినారా? మాయింట్లో మహాలక్ష్మి వూరికే కిందపడి దొర్లుతూ వున్నప్పుడు యెంతఖర్చు చేసినా మీకు లక్ష్యంలేదు.

దం—(తనలో) వీరేంద్రరావు నాదగ్గర డబ్బులేదని యితనితో చెప్పినట్లున్నది. (బిగ్గరగా) డబ్బేమి? కోటివరహాలు యిచ్చినా నిలువదు. మాటవక్కటి శాశ్వతంగా వుంటుంది.

చా—మాయింట్లోపెళ్లికి భోగంమేళం పెట్టము. భోగంమేళం పెట్టడం మావియ్యాలవారికి యిష్టంలేదు.

గణి—ఆచార్లగారూ! ఈవిడె మాటలుచూస్తే మీ యీవిడె యజమానురాలుగా కనపడుతూవున్నది గాని మీరు యీవిడెకు యజమానుడుగా వున్నట్లు కనపడదు. యీవిడే మిమ్మలిని ఆజ్ఞాపిస్తూవున్నదే.

దం—చిన్నప్పటినుంచీ మాయింట్లోవుండడాన్నిబట్టి [illegible] చేత తోచినదల్లా అంటూవుంటుంది. మీరు దీనిమాటలు [illegible] పట్టవలసిన పనిలేదు.

[తమలపాకులును పోకచెక్కలును చేతఁబట్టుకొని
చిన్నమ్మ ప్రవేశించుచున్నది.]

చిన్న—అమ్మా! సత్యవతి వెండిపళ్ళెంకూడా కావలెనేమో అడిగిరమ్మన్నది. వాళ్ళయింట్లో పండాకులు లేవట. పచ్చిఆకులు యిచ్చినది.

చారు—యీఆకులు చాలునులే. మనయింట్లో యిత్తడి పళ్ళెంలోపెట్టి తాంబూలం యిస్తాను. బడివేళ అవుతూవున్నది. నీవు వెళ్ళి పాఠాలుచదువుకో.

గణి—(తనలో) యీచిన్నది "అమ్మా!" అని పిలుస్తూవున్నది. ఈవిడ నిజంగా యీచిన్నదాని తల్లికాదుగదా? (బిగ్గరగా) అమ్మాయీ! యీవిడ నీకేమయినా చుట్టమా?

చిన్న—ఈమె మాఅమ్మ. ఈయన మానాన్నగారు.

గణి—అమ్మా! నీవు యింటియజమానురాలవని యెరగక యీయనమాటలు నమ్మి పనికత్తెవనుకొని చెప్పరానిపనులు చెప్పినాను క్షమించవలెను.

చా—చెప్పితే యేమీతప్పులేదు. నేను ఆయనకు నిజంగా పనికత్తెనే.

దం—పెట్టెనిండా పెట్టెడునగలూ బట్టలూవున్నా వక్కటీ పెట్టుకోకుండా ఇలాగంటి బీదవేషం వేసినందుకు బుద్ధివచ్చేటట్టు చెయ్యవలెనని యీయనతో నీవు మాయింటి పనికత్తెవని చెప్పినాను.

చా—బట్టలూ నగలూ పెట్టెనిండా బూజుపడుతూవున్నవి.

గణి—చాలును. మీయింటిగుట్టంతా విరేంద్రరావుగారి యింట్లో నాకు తెలిసింది, దంబాచార్లగారూ! మీయింట్లోపెళ్ళికి మీ

మేళాన్ని పూరికేనే పంపుతాను. యీవూళ్ళో పనికిమాలినవాళ్ళు కొందరు బోగంమేళాలు వుండకూడదని వాదాలుచేసి మీటింగులు చేస్తూ వున్నారట. మనంకూడా మీటింగులుచేసి వాళ్ళకు గర్వ ప్రాయశ్చిత్తంచేతాము.

దం—మీరు తలుచుకుంటే తప్పకుండా చెయ్యవచ్చును. ప్రపంచం పుట్టినప్పటి నుంచీ వున్న పూర్వాచారం ఇప్పుడు నలుగురు పక్షిగాళ్ళుచేరి పొమ్మంటే పోతుందండీ! మనం వాళ్ళ మీటింగులకు వెళ్ళి మనలోమనం వేరేమీటింగులుచేసీ వాళ్ల ప్రయత్నం మొలకలోనే తుంచివెయ్యవలెను.

గణి—ఆపనియెంత సేపు? నిముషంలో చేతాము. నేనువక్క చుట్ట తాగివచ్చి యీవిషయంలో గట్టి ఆలోచన చేస్తాను. మీరుకూడ యీలోపుగా మీపనిచక్క పెట్టుకోనండి.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

3. రంగము—వితేంద్రరావుగారి చావడి.

[వితేంద్రరావుగారును, గణికాప్రాణనాధరావుగారును, మాయాచార్యులుగారును ప్రవేశించుచున్నారు.]

వితేం—మీరు చెప్పినఆలోచన అనుకూలంగావున్నది. అలా చెయ్యవలెను.

గణి—అనుకూలంగావుండని ఆలోచన యెప్పుడూ చెప్పను. వేశ్యలులేకపోతే సంగీతం పడిపోతుందని మీరుగట్టిగా వాదించవలెను.

వి—మీామనసు వచ్చినంతగట్టిగా వాదిస్తాను. సభలో నావాదంతో యింటిమీాద పెంకులు యెగిరిపోవలెను. నేను యింతమంది భోగంవాళ్ళనూ గుడిసేటివాళ్ళనూ ఆదరించడమేకాని వొక్కనాడూ వాళ్ళపాటమాత్రం విని యెరగను సుమండీ. మీాతోడునిజంచెప్తాను.

గ—మీారు చెప్పినదానికి సందేహం కూడానా? సంగీతం వుండవలెనని వాదించడానికి పాటతెలియనూ అక్కరలేదు. పాట విననూ అక్కరలేదు. ఇంతమంది పెద్దమనుష్యులు పెళ్లిళ్ళలో తాంబూలానికి వస్తారుగదా వాళ్ళల్లోవక్కడైనా పాటతెలిసినవాడు వుంటాడండీ? వాళ్ళ ముఖం భోగంవాళ్ళుమాత్రం యేమిపాటపాడి యేడుస్తారు? వాళ్ళకు పాటలకన్న ముఖాలు బాగావుంటవి. అందుచేత చాలామంది వాళ్ళముఖాలు చూడడానికేవస్తారు. కొంతమంది వూరికే లాంచనానికివచ్చి వాళ్లుపాడినంతసేపూ తములోయేమో మాట్లాడుకుంటూవుంటారు.

వి—మీారుచెప్పినది సత్యం, సంగీతం యెరుగనివాణ్ని నేను సంగీతంకోసం భోగంమేళం వుండవలెనంటే మనప్రతిపక్షులు ఆక్షేపించరుగదా? వాళ్ళుమహాచెడ్డవాళ్ళు.

గ—వాళ్ల మొఖం వాళ్లు ఆక్షేపించేది యేమిటి? వాళ్లునోరుయెత్తేటప్పటికి పదిమందిచేత చప్పట్లుకొట్టించి సభలో అల్లరిచేయించనూ? సంగీతం వచ్చినవాళ్లు భోగంవాళ్లను ఆదరిస్తే అందులో సారస్యమేలేదు. సంగీతరూపంగా ప్రతిఫలం అపేక్షించకుండా సత్కరిస్తేనే గౌరవం యెక్కువగా వుంటుంది. మనం అనుకున్నపనికి మీారుకూడా మద్దతుచెయ్యవలెను.

వి—ఆపనికి నేనుతగినంత మద్దతుచేస్తాను. బడిపిల్లలలో కొందరు పోకిరీలు వున్నారు. పెద్దమనుష్యులం మనం చాటునవుండి వాళ్ళను

కా ప్రోత్సాహంచేస్తే సభలోవాళ్ళు మనం వాగమన్నట్లా వాగు తారు. వాళ్ళలో మేళనాయకులను యిద్దరిని యిక్కడకు వచ్చేటట్లు నేనుయిదివరకే బందోబస్తుచేసినాను. భోగంవాళ్లులేకపోతే సంసార్లం దరూ చెడిపోతారని మనం ముఖ్యంగా వాదించవలెను.

గ—ఆవాదంమానివేస్తామా? భోగంవాళ్ల కులం వుద్ధరించడానికి వెయ్యియుక్తులు పన్నుతాను. మాయాచార్లుగారూ మీరుమాట్లాడ కుండా మౌనంధరించినారేమి?

మా—నేనూ వూరికే కూరుచోలేదు. మాయోపాయాలే ఆలోచిస్తూవున్నాను. భోగంమేళాలు పెళ్ళిళ్ళకు పెట్టకపోతే పూర్వా చారానికి విరుద్ధమనిన్నీ, శిష్టాచారవిరుద్ధంగా నడుచుకుంటే పాపం వస్తుందనిన్నీ, నేను శ్రుతిస్మృతి ప్రమాణాలతో అమోఘమైనవాదం చేస్తాను.

వి—అందులో వేశ్యలను పిలువకపోతే హిందూమతానికే భంగంవస్తుందనికూడా మరిచిపోకుండా చెప్పవలెను సుమండీ.

గణి—మీకు శక్తిపూజేకాని హిందూమతమంటే అభిమానం లేదుగదా, ఈవాదంచేస్తారా?

వి—నమ్మకంయేమిటి? నాకుదేనిలోనూ నమ్మకంలేదు. లేక పోయినా ఆవేళకు అన్నిటిలోనూ నమ్మకంవున్నట్టు నటిస్తాను. అదుగో నేను రమ్మన్న యిద్దరుకుర్రవాళ్ళూ వస్తూవున్నారు. వాళ్ళను కూర్చో బెట్టి, మన ప్రతిపక్షులను లేవిడీకొట్టించడం విషయమయి ఆలోచించ డానికి లోపలికి వెళ్ళి మళ్ళీవత్తాము.

గ—అదిరహస్యకార్యం గనుక ఆలాగే లోపలికివెళుదాము.

[గిరిరావును, రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

వి—అబ్బాయీ! రండి. మాయాచార్లగారికి దొస్లోయేదో మందువేరు కావలెనట. చూపించి యిప్పుడే వస్తాము. మీరుయింతలో మాట్లాడుకుంటూవుండండి.

గి—చిత్తము. వెళ్ళిరండి. (ముగ్గురును వెళ్ళుచున్నారు.)

రా—నీవు యిందాకా అడిగింది చెప్తానువిను. వైశాఖ మాసంలో మాచెల్లెలి పెళ్ళికి నారాయణగారు పువ్వులవాళ్ళమేళం పిలిపించినప్పుడు సమస్తాభరణ భూషితురాలయి రాత్రిదీపాల వెలుగున గేదెకంఠం కీరవాణి గజ్జెకట్టేటప్పటికి దానిమొఖం చూడగానే నావొళ్ళంతా చెమటదిగబోసి బట్టలన్నీ తడిసి ముద్దఅయినవి.

గి—మండువేసవికాలంలో నీకు వేరేస్నానం అక్కరలేకుండా వొళ్ళంతా చల్లపడి హాయిగావుండి వుండవచ్చును.

రా—చల్లపడాలేదు యేమీలేదు. నాకు తాపంమాత్రం యెక్కువయింది.

గి—వొళ్ళుతడిస్తే తాపంయెలా యెక్కువవుతుంది?

రా—యెండవల్ల కలిగిన పయితాపం చల్లారినా లోపల మొలకరించిన కామాగ్ని రగులుకుని మండడం మొదలుపెట్టడంచేత.

గి—ఆకామాగ్నిని తరువాత యెలాచల్లార్చుకొన్నావు?

రా—యెలాగా? నిజంచెప్పనా? ప్రాణస్నేహితుడవు గనుక నీతోచెప్తాను. మరియెవరితోనూ చెప్పకేమి. మనశృంగార ప్రబంధాలలో కలువ్రవర్ణించే అధరసుధారసపానం—చెప్పడానికి నాకు సిగ్గు వేస్తూవున్నది.

గి—అంతసిగ్గుగావుంటే చెప్పకు. నాకు బోధపడ్డది. కామజ్వరానికి అధరామృతం వొక్కటే అమోఘమయిన దివ్యౌషధం.

బహుధనసాధ్యమయిన అధరసుధ విద్యార్థివి నీకు యెట్లా సాధ్య మయింది? నీపాలిటికి ధన్వంతరిలాగు కీరవాణే అడ్డపడి మీనాన్నగారు దయచేసిన సంభావననుపట్టి ధర్మార్థంగా మందిచ్చి నీప్రాణాలు నిలువ బెట్టిందికాబోలును! తరువాత వయిద్యకట్నమయినా యెలా తెచ్చుకో గలిగినావు?

రా—తరువాత నేను వైద్యం చేయించుకున్న సంగతి నీకు యేలా తెలిసింది? ఆఖున్ను మాతండ్రిగారే పెట్టినారు.

గి—వైద్యకట్నమంటే కీరవాణికి చెల్లించవలసిన కట్నమని నాఅభిప్రాయం.

రా—సరిసరి! నీఅర్థం తెలిసింది. బుద్ధివుంటె మార్గాలు దేవుడే తోపిస్తాడు. కీరవాణి మేళంచాలించి వెళ్ళగానే నేను యింట్లోకి వెళ్ళే టప్పటికి నాకంటియెదుట గదిగూట్లో తెల్లగా వెండిగిన్నె వకటి కన బడ్డది.

గి—ఆగిన్నె యెత్తుకొనిపోయి దానికిచ్చినావా యేమిటి?

రా—అబ్బే! నేను ఇంగ్లీషు చదువుకుంటూ అలాగంటి దొంగ పని యెప్పుడయినా చేస్తాననుకున్నావా యేమిటి? ఆగిన్నె అక్కడ అట్టేవుంటే యెవరైనా యెత్తుకుపోతారని మెల్లగాతీసి జేబులో వేసు కొని జాగ్రతచేసినాను.

గి—ఆగిన్నె తరువాత మీవాళ్ళకు యిచ్చివుంటావు.

రా—యిచ్చేవుందునుగాని యింతలో వకతమాషా జరిగింది. ఆగిన్నె చేతపట్టుకొని నేను తిన్నగా కీరవాణియింటికి వెళుతూవుండగా దోవలో వకబీదవాడు తనవుద్దవున్న పదిహేను రూపాయలూ కంసాలి యింటికి తీసుకొనిపోయి వాటితో వెండిగిన్నె అవుతుందా అని అడు గుతూ వున్నాడు. కంసాలి యిరవయిరూపాయలకు తక్కువఅయితే కాదంటూవున్నాడు. ఆమాటవిని బీదవాడు మిగిలిన రూపాయలు

తెచ్చుకోలేక దుఃఖపడుతూవుంటే. జాలిగుండె కలవాణ్ని కావడంచేత ఆబీదవాడి దుఃఖంచూచి మనస్సుకరగినవాణ్నాయి వాణ్ని చేస్సైగచేసి నేను దూరంగాపిలుచుకొనిపోయి, అటువంటి బీదవాడికి చేసినదే వుత్తమదానమని యెంచి వాడివద్దవున్న పదిహేనురూపాయలూ పుచ్చుకొని యెవరితోనూ చెప్పవద్దని చెప్పి యిరవయ్యైదురూపాయల గిన్నె వాడికి దానంచేసినాను.

గి—సొమ్ముపుచ్చుకొని గిన్నె యిస్తే, అందులో దానంయేమున్నది?

రా—నీవు వట్టిమందమతివి. నీవు ధర్మసూక్ష్మం యేమీ గ్రహించలేవు. పదిహేనురూపాయలు పుచ్చుకొని యిరవయి అయిదు రూపాయల గిన్నెయిస్తే తక్కిన పదిరూపాయలూ దానమవుతవా? మరియేమయినా అవుతవా? నేను చేసినదానం యిప్పుడు నీకు బోధపడ్డదా?

గి—ఈదానంసంగతి తరువాతనయినా మీవాళ్ళతో చెప్పినావా?

రా—ఎందుకు చెప్తాను? ఎప్పుడూ చెప్పలేదు. నీవు యింత చదువుకున్నా నీకుయింకా గుప్తదాన ప్రభావము బోధపడనేలేదు. చేసినదానం చెప్పుకుంటే పుణ్యంపోతుందని యీసంగతి యిప్పుడు ప్రాణమిత్రుడవైన నీవక్కడితో తప్ప మరియెవ్వరితోనూ చెప్పలేదు. నీవుకూడా యీరహస్యం యెవ్వరితోనూ చెప్పకుండా దాస్తే యీ పుణ్యంలో సగం నీకుకూడా వస్తుంది.

గి—తక్కిన రూపాయలైనా మీవాళ్ళకుయిచ్చినావా? అది లేదా?

రా—యెందుకు యిస్తాను? రూపాయలు మావాళ్ళచేతులలో పెడితే యింటికోసం పాడుకర్చు చేస్తారని నేనారూపాయలు దేవతార్చనం చేసినాను.

గి—భోగానికని దేవుడికిగుళ్ళో దేవుడికి సమర్పించినావా?

రా—ఏమన్నావు? భోగ—లేదు. రాతిదేవుడికి యిస్తే పుణ్యంలేదని ప్రాణంలోవున్న దేవతకే సమర్పించినాను.

గి—మనంలో ప్రాణంలోవున్న దేవతకూడా వుంటుందా?

రా—నీవు వ్రాతకే హెచ్చుపున్నవాడవే కాని వేదశాస్త్రపాఠం నీకు అణుమాత్రమూ లేదు. ఇన్ని రోజులొచ్చినా మన వేదంలో "మాతృదేవోభవ" అని వున్న వాక్యం నీవు విననేలేదుగదా? వేదవిశ్వాసం గలవాణ్ని గనుక నేను తిన్నగా ఆరూపాయలు కీరవాణి ఆలయానికి తీసుకొనిపోయి దానితల్లి అయిన మాతృదేవతకు సమర్పణచేసినాను. అందువల్ల నాకు పుణ్యమూ పురుషార్థముకూడా కలిసివచ్చినది. "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అని చెప్పిన పండితు డెంతటి బుద్ధిమంతుడు.

గి—నీతాత్పర్యం యిప్పటికి నాకుపూర్తిగా బోధపడ్డది. సరి సరి! ఆముడుపుచెల్లించి వృద్ధదేవతానుగ్రహం పొందడంవల్ల, నీకు కామాగ్నితాపం చల్లారడానికిపరం లభించింది. అయితే ఇలాగంటి పనిచెయ్యడం దొంగతనంకాదూ?

రా—నీచదువు యేటిసెసక్తోవున్నది. యెంతచదువుకున్నా నీకు వివేకంరాలేదు. తనసొత్తుకు తనకు దొంగతనం యేమిటి? కొడుకును నేనుపుట్టగానే నాతండ్రి ఆస్తిలో నాకు సగంభాగంవుంటుంది. నాతండ్రీ నేనూ సమానభాగం కలవాళ్ళంకావడంచేత నాతండ్రి ఖర్చుపెడితే యెంతో నేను ఖర్చుపెట్టినా అంతే. నీవు యిప్పుడు దొంగతనంగా చేసి నానంటూ వున్నావుగాని నాకు స్వతంత్రం వచ్చిన తరువాత నాఆస్తి అంతా కీరవాణికి దొరతనంగానే దానం చేస్తానుచూడు.

గి—మహాదొడ్డపని చేస్తావు. తరువాత యింట్లో మీవాళ్ళు గిన్నె వెతుక్కొని విచారపడ్డారా?

రా——విచారం యెందుకుపడుతారు? పెళ్ళిళ్ళల్లో యేవయినా రెండూమూడూ వస్తువులు పోవడం అచారంగనుక, యేదీ పెద్దవస్తువు పోకుండా దీనితో సరిపోయిందని సంతోషమేపడ్డారు. నా యీచిన్న కార్యావల్ల యెంతమందికి సంతోషం కలిగిందో చూచినావా?

గి——ఎవరికి సంతోషం కలిగినా నీభార్యకుమాత్రం తప్పకుండా దుఃఖమే కలిగి వుంటుంది. మనక్లాసులో కుర్రవాళ్ళు కొందరు నీవు చెప్పినట్టు చెయ్యడం భార్యాద్రోహం అంటారు యేమిటిరా!

రా——యేడిసినారులే. వాళ్ళ మొఖం కుర్రవాళ్ళకు యేమి తెలుసును? వాళ్ళువివేకశూన్యమొక్క దుర్బోధవల్ల మంచీచెడ్డా తెలియక చెడిపోతూవున్నారు. మనంకోరి తెచ్చుకొన్న భార్యలవిషయంలో చేస్తే యింకాకొంత భార్యాద్రోహం అనవచ్చునుగాని మనయిష్టం అడగకుండా మనచిన్నతనంలో మనతల్లిదండ్రులు పెళ్ళిచేసినప్పుడు యేమిచేసినా ద్రోహంలేదు. అయినా నాభార్యకు విద్యరాదు; మాయింట్లో దానితో నేను పగలుమాట్లాడడానికయినా వల్లకాదు. అంతేకాకుండా అది మహా అనాకారి.

గి——అనాకారివిగాక నీవుమాత్రం మహా చక్కనిచుక్కలాగు వున్నావా యేమిటి? నీవునాకిచ్చిన నీఫొటోగ్రాఫు చూడుమని నా స్నేహితుడి చేతికిస్తే, అతను చూచి దానికి వెనుకవైపున తోకకూడా తగిలించిన పక్షానికి ఆంజనేయ విగ్రహం కింద అమ్మవచ్చునని చెప్పినాడు. ఆయన చెప్పినట్టునీకు తోకకూడావుండి శ్రీరాముల వారి కాలములో వుండినట్టయితే నీవు రామసేనాధిపత్యం పొందివుందువు. నీకిప్పుడయినా ఆలోపంలేదు. మనవూళ్ళోవుండే మర్కటసేనకంతాయిప్పుడూ నీవే నాయకుడవు. ఓరీ! నీవుస్త్రీలకు విద్యకూడదంటూవే మళ్ళీ నీపెళ్ళాం చదువుకున్నదికాదని లోపం యెంచుతావేమి?

రా—విద్యఅంటే సంగీతవిద్యఅని నా అభిప్రాయం. నా పెళ్ళాము పాడడము యేనాడూ చేతకాదు. కీరవాణి యెలా పాడుతుందనుకున్నావు?

గి—నీవు చెప్పనక్కరలేదు. దానిపాట నేనువిన్నాను. ఈవూళ్లోకెల్లాబాగా పాటపాడేది మామనోరంజనికూతురు వొక్కత్తే. మాకీరవాణిపాటపాడితే మృగాలుకూడా వినడానికి వస్తవి. మాకీరవాణికి యింటిపేరు గేదెకంఠంవారు అని వుండడం కంటె గాడిదకంఠంవారు అనివుంటే యెక్కువసార్థకంగా వుంటుంది. మొన్న పెళ్ళివారి యింట్లో పాటప్రారంభించి మాకీరవాణి కంఠంయెత్తేటప్పటికల్లా తమచుట్టము అనుకొని వీధులో గడ్డిమేస్తూవున్న చాకలి గుర్రాలురెండు తమమోత మానుకొని లోపలికి పరుగెత్తుకొని వచ్చినవి.

రా—మీ మనోరంజని కూతురుమాత్రం మాదానికంటె బాగా పాడుతుందేమి? చాకలిగుర్రాలుకూడా పాటగ్రహించగలవేమో యెవరెరుగుదురు? "వేత్తిగానరసంఫణి" అన్నట్టు పాములే పాట గ్రహిస్తూవుంటే చాకిగుర్రాలుమాత్రం యెందుకు గ్రహించలేవు?

గి—అవి గ్రహించినట్టు మరియెవరూ గ్రహించలేరు. పాట బాగాగ్రహించడానికే దేవుడు వాటికి పెద్దచెవులు పెట్టినాడు. చాకిగుర్రమని వాటిపేరులోనే గుర్రమనేపదం వున్నది. గుర్రానికి గంధర్వనామము లోకప్రసిద్ధం. గంధర్వశబ్దమునకు పాటపాడువాడన్న అర్థము నీకూ తెలుసును. గాంధర్వమనగాపాట. నీవు వినవలెనంటే కీరవాణియింటికి వెళ్ళడానికి బదులుగా నాతోకూడా చాకిరేవుకాడికి వస్తే డబ్బు లేకుండా నిత్యమూ కావలసినంత గాడిదగాంధర్వము నీచెవుల బడేటట్టుచేస్తాను.

రా—భోగందన్న గౌరవమయినా లేకుండా నీవు మాకీరవాణిని బహుఆక్షేపిస్తూవున్నావు. ఇదివరదాకా భోగంవాళ్ళు వుండడం

మంచిదని రేఫుమీటింగులో వాదిస్తానని బహుజంభాలు కొడుతూ వున్నావు. తీరాసమయం వచ్చేటప్పటికి సభలో నోరెత్తక దగాచేస్తా వేమిటి? అలాచేస్తేమనకందరికీ బహుచిన్నతనం సుమా. అనగో విశేంద్రిరావుగారు మొదలైన మూర్తిత్రయమూ వస్తూవున్నారు. యీపాటి మనప్రసంగం చాలింతాము.

[విశేంద్రరావుగారును, గణికాప్రాణనాధరావుగారును, మాయాచార్ల గారును, మరల ప్రవేశించుచున్నారు.]

విశే—అబ్బాయీ! మీ రనుకుంటూవున్న చివరమాటలు మేమువిన్నాము. మీరు వాళ్ళసభలో జంకలేకుండా మాట్లాడకపోతే చిన్నవాళ్ళకు మీకుపరాభవమేకాక మిమ్మునమ్ముకునివున్న పెద్ద మనుష్యులకు మాకుకూడా చిన్నతనంగా వుంటుంది. మీరు రేఫుమెలా మాట్లాడుతారో వాళ్ళను తలవంచుకు వేటట్టు చెయ్యావలెను.

రా—చిత్తము. మీ ప్రాపువుంటే మేము యెంతపనైనా చేస్తాము.

గణి—మీకు యేమీభయంలేదు. మేమంతా మీపక్షమే వుంటాము. మేమేఅన్నమాటయేమిటి! వాళ్ళ వాళ్ళు యెవళ్ళో విరోధులు కొందరుతప్ప వూరంతా మనపక్షం. ఏదీ మీరు యెలామాట్లాడు తారో రేపుచూతాముకాదూ! మీమాటలువిని వాళ్ళు తలవంచుకుని యింటికిలేచిపోవలెను. ఇప్పుడు పాడవుతూవున్న హిందూమతాన్ని మీరు వుద్ధరించవలెను. వొకవేళ మీరుప్రొద్దున్నే కీరవాణియింట్లో తరవాణీఅన్నమూ తిని వచ్చినా మొఖాన్ని విభూతిమాత్రం బాగా పెట్టుకోవలెను. సదాచారం గనుక రాత్రి భోగంవాళ్ళ యిళ్ళల్లో కొంచెం సురాపానంచేసినా బ్రాహ్మణులతోనూ పెద్దవాళ్ళతోనూ భక్తిమాత్రం

బాగాకనపర్చవలెను. మీకుకర్తవ్యమంతా విరేశలింగంరావుగారు వుపదేశిస్తారు. మనం యిక్కడమీటుకావడం రహస్యంగనుక యెవరైనా అడిగితే మీరువిరేశలింగంరావుగారి యింటికి వెళ్ళనే లేదనండి. మేము వెళ్ళివస్తాము. (అనివెళ్ళుచున్నారు.)

విరే—అబ్బాయిూ! మీరులోపలికిరండి. రేపటియుద్ధానికి మిమ్మలిని తయారుచేస్తాను. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## ౮. రంగము—సభామందిరము.

[గిరిరావును, రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

గిరి—ఓరీ! రాజరత్నమూ! మనం యిద్దరముమాత్రమే వచ్చినాము. ఇంకా యెవ్వరూ సభికులు రాలేదు.

రాజ—మనం ముందుగావచ్చినాము. సభికులు రావడానికి కావలసినంతవేళ వున్నది. విరేశలింగంరావుగారు వ్రాసియిచ్చిన వుపన్యాసం బాగావల్లనవేసినావా? తడుముకోకుండా సభలోనుంచినీళ్ల ప్రాయముగా యేకరువు పెట్టవలెను.

గిరి—ఆవిషయంలో యేమీఫర్వాలేదు. కుర్రవాళ్ళను మనని ముందుకు తోసితీరా సమయం వచ్చేటప్పటికి వారు తాము యేమీ యెరగనట్టు తటస్థంగా వూరుకుంటారేమోనని నాకుభయంగా వున్నది.

రాజ—పెద్దమనుష్యులు వారుయెప్పుడూ మనవిషయంలో మోసంచెయ్యరు. వారిలోవిరేశలింగంరావుగారు బహుసమర్థులు. వారు మనవిషయంలో యెంతపనైనా చేస్తారు. మనమీద గిట్టనివాళ్ళు యే

మయినా కేజు గీజు తీసుకునివస్తే మాయాచార్లగారు యెంతపనైనా చేస్తారు. ఆయనకోర్టులో జడ్జీముందు వాదించడమే కాకుండా పయికి నీతివాక్యాలు చెప్పుతూనే లోపల నానామోపాయాలు పన్ని యెంతవాణ్ణీ నిముషంలో పడతోస్తారు.

గిరి—ఆయనవద్ద అంతసామర్థ్యం వున్నదా?

రాజ—నీవు యెరుగవుగాని యెంతసామర్థ్యమయినా వున్నది. మొన్న బుచ్చిరాజుగారి ఫోర్జరీకేసులో సాక్షులను తరిబీతుచేసి అబద్ధం నిజంగా కనపడేటట్టు చేసినారు. ఆయనశక్తికి జడ్జీగారుకూడా హాశ్చర్యపడ్డారు.

గిరి—ఆయన సాక్షులను అంత బాగా తరిబీతు చేస్తారేమి?

రాజ—తరిబీతేమిటి? స్కూలుమేష్టరు విద్యార్థులకు బోధించేదానికంటెనూ యెక్కువపనిచేస్తారు. ఆయన మొన్న వక్క కేసులో పల్లెటూరినుంచి వచ్చినసాక్షికి బోధచేసేటప్పటికి సాక్ష్యమంతా వాకిట్లో పంజరంలోవున్న చిలుకకుకూడా వచ్చింది. ఇకమనుష్యులకు రావడంలో హాశ్చర్యం యేమివున్నది?

గిరి—గొప్పసామర్థ్యమే.

రాజ—ఇదేమిసామర్థ్యం? ఇంకావున్నది. సాక్షుల విషయంలో తాను యింతపని చేసినా తనయెదటి పార్టీతరఫు ప్లీడరు సాక్షులకు బోధచేస్తూవున్నాడని వసంతిసేని విరోంచర్రావుగారి సహాయంచేత వూరందరినీ నమ్మించినాడు. వక్కటాకీని పలికించి నిజం అబద్ధంగానూ అబద్ధంనిజంగానూ కొత్తసృష్టి చేయించడానికి ఆయనవద్ద కావలసినంత జట్టువున్నది.

గిరి—గణికాప్రాణనాథరావుగారు యెటువంటివారు?

రాజ—ఆయన వేశ్యాభిమానంచేత పనిమానుకుని యింట్లో కూర్చుండి వూరూరూ తిరుగుతూవున్నారు. ఈవిషయంలో ఆయన

యెంతపనిఅయినా చేస్తారు. వేశ్యలకు యెంత జనవశ్యంవున్నదో వేశ్యల మూలంగా ఆయనకూ అంతజనవశ్యం వున్నది. అగ్నిహోత్రుడికి వాయుదేవుడు సహాయమయినట్టు ఈయనకిప్పుడు విశేంద్రరావుగారు కూడా సహాయులయినారు. ఈమూర్తిత్రయమూ చేరడంచేత శత్రువుల కుతంత్రాలనన్నిటినీ నిమిషంలో భస్మంచేసి ముగ్గురూ మూడు లోకాలుజయిస్తారు. ఈరోజున విశేంద్రరావుగారు మనప్రతిపక్షులను లేవిడీ కొట్టించడానికి యెంతమందిని తమతో తీసుకవస్తారో చూడు.

గిరి—అందరినీ మొగవాళ్ళనేనా? భోగంవాళ్లనుకూడా తీసుకుని వస్తారా?

రాజ—సభలో వేశ్యాపక్షం వాదం చెయ్యడానికి కీరవాణి తల్లిగారుకూడా వస్తారు. ఆమెయొక్క వాక్చమత్కారం నీవేచూస్తావు.

గిరి—ఏమిరా! చెప్పవూ! ఈరోజుసభకు మీాముండతల్లికూడా వస్తుందేమి?

రాజ—నీవుబొత్తిగా పరువూమర్యాదా యెరగకుండా మాట్లాడుతున్నావుసుమా? జాగ్రత్త! భోగమమ్మవారన్న గౌరవమయినా లేకుండా, ఆజగన్మోహినిని ముండఅంటావా? ఇదియెంతతప్పుమాట! ఇటువంటి మాటలంటె నేను సహించలేను. నాకుమహాకోపం వస్తావున్నది. కావలిస్తేనన్ను "గాడిదా" అనిపిలువు నేనుపడుతాను. అంతే కాని భోగమమ్మవార్లనుమాత్రం నాయెదుట యెప్పుడూ—

గిరి—ఈపాటి నీచమువుచాలించు. అదుగో వివేకరావుగారూ మొదలయినవారు వస్తూవున్నారు. మెల్లిగామాట్లాడు. అదుగో సభకు గుంపులు గుంపులుగా చాలామంది వస్తూవున్నారు.

[వివేకరావుగారును, సత్యప్రియాచార్యులుగారును, నయభూషణరావు పంతులుగారును, బహుజనులతో ప్రవేశించుచున్నారు.]

వివే—చాలామంది వచ్చినారు. మనమీపాటి పని ఆరంభించ వచ్చును. విటేంద్రరావుగారున్ను గణికాప్రాణనాథరావుగారున్ను పెద్ద మూకను వెంటబెట్టుకొని వస్తూవున్నారు.

రాజ—ఇంకాకొంచెంసేపు ఆగండి. మాయాచార్యులుగారు రావలెను.

సత్య—మనం యెవరికోసమూ ఆగనక్కరలేదు. ఇష్టంవున్న వారు సమయానికే వస్తారు.

నయ—ఇవేళ యెప్పుడూ యేమీటింగుకూ రానివారందరూ వస్తూవున్నారు. యేకో విశేషం వున్నది.

వివే—నయభూషణరావు పంతులుగారూ! చెవులోమాట. (రహస్యముగా) విటేంద్రరావుగారు మీటింగులో అల్లరిచేయించడానికి యెన్వరినో మూకను పోగుచేస్తూవున్నారని తోవలో తెలిసి పోలీసు యినస్పెక్టరుగారికి వర్తమానం పంపించినాను. ఇద్దరు ముగ్గురు కనిస్టేబిల్సును తీసుకుని త్వరగా దయచెయ్యమని మీరుకూడా యెవరిచేతనైనా కబురుపంపించండి.

నయ—(రహస్యముగా) అలాగా? నాకీసంగతి తెలియనేలేదు. మావాణ్ని పంపిస్తాను.

వివే—మీటింగు ఆరంభింతాము. నేను సత్యప్రియాచార్యులు గారిని అగ్రాసనాసీనులనుగా ప్రొపోజు చేస్తూవున్నాను.

నయ—నేను శెకండుచేస్తూవున్నాను.

రాజ—మాయాచార్లుగారు చైర్మానుగావుంటే బాగుంటుంది.

నయ—అబ్బాయీ! విద్యార్థివి నీకు యింకాయేమీ తెలియదు పూరుకో. మాయాచార్యులుగారు యింకారాలేదు. ఆయనవస్తారో లేదో తెలియదు.

విజే—తప్పకుండా వస్తారు.

వివే—వస్తేవస్తారు. సత్యప్రియాచార్యులుగారిని అగ్రాసనాసీనులనుగా చెయ్యడం అయిపోయింది. పనికారంభింతాము. భోగంవాళ్ళను వివాహాది శుభకార్యములలోనూ, వుత్సవాలలోనూ పిలిచి గౌరవించడంచేత చాలా అనర్థాలు కలుగుతూ వున్నవి.

రాజ—లేవు లేవు.

వివే—అలాగయితే వ్యభిచారం మంచిదనా నీఅభిప్రాయము? భోగంవాళ్ళ కులవృత్తి వ్యభిచారం—

రాజ—వ్యభిచారం మంచిదని నేనూ అనను. వ్యభిచారమంటే నాకు మీకంటెనూ యెక్కువకోపమే. నేను మొన్న రాత్రి భోజనం చేసి తాంబూలం వేసుకుంటూ కీరవాణి యింటికి యిట్టేవెళ్ళేటప్పటికి అక్కడ స్కూలు పిల్లవాడొకడు నాకంటబడ్డాడు. చూడడంతోటే నాకు మహాకోపంవచ్చి తిట్టి కొట్టి నాస్నేహితుడని అయినా చూడకుండా తక్షణం వాణ్ని అక్కడనుంచి తరిమివేసినాను. ఇప్పటి పిల్లవాళ్ళకు బొత్తిగా నీతిలేదు.

నయ—నీతిమంతులు తమరక్కడకు రాత్రివేళ యెందుకు దయచేసినారు?

రాజ—యెందుకా! యెందుకో మరచిపోయినాను. జ్ఞాపకం చేసుకుంటాను. ఆలోచించి చెప్తాను. ఎందుకు వెళ్ళినానా? భోగంవాళ్ళయింటికి యెవరయినా బుద్ధితక్కువ పిల్లవాళ్ళు వెళుతారేమో

మండలింతామని వెళ్ళినాను. గిరిరావ్వూ! నేనువెళ్ళింది అందుకేకాదూ? (రహస్యముగా) మొద్దులాగు వూరుకుంటావేమి? అవునని చెప్పూ.

గిరి—(రహస్యముగా) నేను అబద్ధంచెప్పను.

రాజ—(రహస్యముగా) చెపితే తప్పులేదు. నీకు చుట్టలు కొనుక్కోవడానికి డబ్బుయిస్తానులే చెప్పూ.

గిరి—ర(హస్యముగా) ఏమిచ్చినా చెప్పను.

రాజ—మాజట్టులో కొత్తవాళ్ళను చేర్చుకోకూడదు. చేర్చు కుంటే చెప్పినమాట వినక సమయానికి రసాభాసం చేస్తారు. నీకంటె పెద్దవాణ్ని నేను వూరికే రోజూ లక్షఅబద్ధాలు ఆడుతూవుంటే నీవు డబ్బు యిస్తానంటూ వున్నాకానీ వొక్కఅబద్ధమాడడానికి సందే హిస్తావేమి?

వివే—ఓసభాసదులారా! చూచినారా? విద్యార్థులకూడా భోగంవాళ్ళ యిళ్ళకు వెళుతూవున్నారని యీచిన్నవాడు చెప్తూ వున్నాడు. ఇది సంసారుల యిళ్ళకు భోగంవాళ్ళను పిలిపించడంవల్ల వచ్చిన అనర్థం. ఈయనర్థం మనం యింతటితోనైనా తొలగించడానికి ప్రియత్నంచెయ్యవలెను. ఆరంభమయిన తరువాత వ్యభిచారం తాను వొంటిగావుండదు. దొంగతనమున్ను తాగుబోతుతనమున్నుకూడా దానికి యెప్పుడూ తోడుగావుంటవి.

రాజ—తాగుబోతుతనమంటే జ్ఞాపకంవచ్చినది. శ్రీరామనవమి నాటి రాత్రి కీరవాణి దేవుడిగుళ్ళో గజ్జెకట్టి ఆటచాలించి యింటికి వెళ్ళబోయేటప్పుడు పోయి, రహస్యంగా గరుడవాహనం చాటున దాచుకున్న సారాబుడ్డి చూచుకునేటప్పటికి వట్టిబుడ్డివున్నది. యెలాగు చూచినాడో కాని యిున్న నేను తటిమివేసినపిల్లవాడే మెల్లిగాపోయి యెవ్వరూ చూడకుండా దాన్ని యిట్టే తాగివేసినాడు. అక్కడికీ నాకు నెయ్యికళ్ళువున్నవి గనుక వాడులేపడంతోటే కనిపెట్టి నేను వెంట

వెళ్ళేటప్పటికల్లా నోట్లోపోసుకొని నన్నుచూచి తెల్లపోయినాడు. ఏమిరా యిలాచేసినావంటే యీబుద్ధి గిదని యెరగనన్నాడు. మరిపకరిదైతేమాత్రము తాగవచ్చునా అంటే, మంచినీళ్ళనుకుని తాగినా నన్నాడు. అబద్ధాలుకూడా ఆడుతావురాఅంటే నీవు రోజూ కీరవాణి యింట్లో తాగుతూవున్న సంగతి అందరితోనూ చెపుతానని పది మందిలోనూ కేకలువెయ్యడాని కారంభించినాడు. అటువంటి తెంపరి వాడితో పోట్లాడితే నాకే పరువుతక్కువని నేను నోరుమూసుకొని వూరుకున్నాను. నేను ఔషధానికని రహస్యంగా కీరవాణియింట్లో కాస్త బ్రాంది పుచ్చుకుంటూవున్నందుకు వాడు యెంతదౌర్జన్యం చెయ్యడానికి సిద్ధమయినాడో చూచినారా! నేను యిందాకా పొర పాటుగా చెప్పినాను. నేను కీరవాణియింటికి రాత్రిళ్ళు సంగీతం విన డానికి వెళుతూవుంటాను. భోగంవారి వృత్తి పడగొట్టడానికి యిలాగు బ్రహ్మప్రయత్నం చెయ్యడంకంటె మీరు తాగుబోతుతనం మాని పించడానికి కృషిచేస్తే బాగావుంటుంది.

వెంకయ్య—నీతివృక్షానికి వేరుపురుగులలాగు మీరు యిద్దరూ చేరి మావిద్యార్థులకందరికీ అపఖ్యాతి తెస్తూవున్నారు. మీవంటి పనికిమాలినవాళ్ళు వూళ్ళోవకరిద్దరువుంటే యెరగనివాళ్ళు తక్కినవాళ్ళందరూ యిలాగంటివాళ్ళే అనుకుంటారు. సభలలోకివచ్చి యిటువంటి వేలాపసలు పేలకుండా మిమ్మలిన చితకకొడితే—

రాజ—నోరుమూసుకో. యింకా యిలా వాగుతూవున్నా వంటే యింటికివెళ్ళేటప్పుడు దోవలోనిన్ను నిజంగానే చితకపొడి పిస్తాను. విద్యార్థులలో విద్యార్థులకే కట్టులేదు. వొకడు యేటికీస్తే వొకడు కాటికీస్తూ యతిఅంటే ప్రతిఅంటాడు. అదుగో మన మాయా చార్లగారు పోలీసుయినిస్పెక్టరుగారినీ కనిస్టేబిలులను వెంటబెట్టుకుని. వస్తూవున్నారు. ఈవేళ యేదోవిశేషం జరుగుతుంది.

[మాయాచార్యులుగారును, పోలీసుఇన్‌స్పెక్టరుగారు మొదలయిన వారును ప్రవేశించుచున్నారు.]

విట—మాయాచార్లుగారు! దయచెయ్యండి. (రహస్యముగా గిరిరావును జూచి) అబ్బాయీ! యిక భయంలేదు. నీవు చెప్పదలచు కొన్నది నిశ్చయముగా చెప్పు.

గిరి—(రహస్యముగా) ఎలాగు ఆరంభించవలెను? నేను సల్లించు కొన్న దాని మొదలు మరచిపోయినాను. మొదలువస్తేనేకాని చివ రంటూ జ్ఞాపకంరాదు. వక్కమాటు జేబులో కాగితంతీసి చూచు కుందునా?

విట—(రహస్యముగా) కాగితం పయికితియ్యకూడదు. నాదస్తూరీ యెవరయినా ఆనవాలుపడితే తంటావస్తుంది. మొదలుపోతే పోయిం దిలే. అందులో యేమీలేదు. వాళ్ళను తిట్టడం ప్రారంభమయింది. అక్కడనుంచి ఆరంభించు.

గిరి—(రహస్యముగా) పోలీసు ఇనస్పెక్టరునుచూస్తే నాకు భయంవేస్తూవున్నది.

విట—(రహస్యముగా) నీకేమీ భయంలేదు. ఆయనను మన మాయాచార్లగారే వెంటబెట్టుకుని వచ్చినారు. ఆయన మనకే సహా యం చేస్తాడు. ఆయనకు నిన్ను ఇంట్రొడ్యూసు చేస్తాను. బాగా మాట్లాడు. (బిగ్గరగా) అయ్యా! ఇనస్పెక్టరుగారు దయచేసినారా? సంతోషంగా వున్నది. ఈచిన్నవాణ్ని యెరుగుదురా? ఇతడు బుద్ధి మంతుడు. ఈదినం సభలో వుపన్యాసం చెయ్యడానికి వచ్చినాడు.

ఇన్— ఇతను యెవరో జ్ఞాపకంలేదు. పేరుచెపితే యితనిపేరు పోలీసుక్రైము రిజిస్టరులోవుంటే చూచి జ్ఞాపకంచేసుకుంటాను.

గిరి—నా పేరు గిరిరావు. నన్ను మీరు మరచిపోయినారు. నేనూ మిమ్మల్నిని మరచి పోయినాను. మిమ్మల్ని నేను యిదివరకు యెప్పుడూ దర్శనం చెయ్యలేదు.

ఇక—అసలు నీవు నన్ను యెప్పుడూ చూడనిదే మరిచిపోవడం యెట్లాతటస్థమయింది ?

గిరి—అవును నేనుమిమ్మల్నిని యెక్కడూ చూడనిదేమరచి పోయినాను. యెలాగు మరచిపోయినానో యిప్పుడు చెప్పలేను. నాతె క్స్పిరయినతరువాత సావకాశంగా జ్ఞాపకం చేసుకోవలెను.

వివే—ఓ సభాసదులారా! యిప్పటికి వ్యర్థకే కాలహరణ మవుతూ వున్నది. మనమిప్పుడు చెయ్యవలసినపని చిత్తగించండీ. వివాహాదులలో వేశ్యలను మనుష్యులకు రప్పించడంవల్లకలుగుతూవున్న నష్టములెన్నోవున్నవి. వాటినన్నిటినీ బుద్ధిమంతు లయిన మీకు విన్నవించి చెప్పవలసిన పనిలేదు. అందులో మనపిల్లవాళ్ళు చెడిపోవడానికి మూలంగావున్న రెండుమూడు నష్టాలు—

గిరి—పిల్లవాళ్ళకు యేమీనష్టాలులేవు. పిల్లవాళ్ళు భోగం వాళ్ళవల్ల యెంతమాత్రమూ చెడిపోవడంలేదు. పిల్లవాళ్ళసంగతి మా పిల్లవాళ్ళకు తెలియవలెనుగాని గడ్డాలూ, మీసాలూ నెరసిన ముసలి వాళ్ళకు మీకు యేమి తెలుస్తుంది? భోగంవృత్తి మంచిది కాదనేవాళ్ళు నట్టిపౌరుషహీనులు; వాళ్ళవద్ద మగతనంలేదు; రసికత్వంలేదు; సంగీత సారస్యంలేదు. సంగీతమందు రుచిలేనివాళ్ళు నరహంతకులైన క్రూరకర్మరతులని మహాకవి అయిన షేక్స్పియరు చెప్పినాడు. పిల్లవాళ్ళకు భోగం వాళ్ళు అవశ్యంగావుండవలెను. ఇప్పుడు సాధారణంగా పిల్లవాళ్ళకు కలుగుతూవుండే వీర్యనష్టవ్యాధులకు భోగంవాళ్ళు అవశ్యంగా కావలె నని డాక్టర్లుకూడా చెప్తూ వున్నారు. ఇదంతా నావుపన్యాసంలో

వున్నది. ముందుగా నావుపన్యాసంవింటే నంది యెవరి వుపన్యాసాలూ అక్కరలేకుండా యీ మీటింగుతోనే పనిలేకుండా పోతుంది. కాబట్టి సభవారు ముందుగా నావుపన్యాసం వినవలెను.

వెం—పెద్దలంతా వుంటూవుండగా కుర్రవాళ్ళం ముందుగా మనవుపన్యాసాలేమిటి? యీపాటికూర్చో. అనుభవశాలులైనవారు చెప్పింది విన్నతరువాతమనంచెప్పవలసింది యేమైనావుంటే చెప్పుదాము.

సత్యా—అబ్బాయీ! యీసభపిల్లవాళ్ళు మాట్లాడడంకోసం వుద్దేశించినదికాదు. కాస్తసేపు వూరుకోండి. పెద్దలందరూ చెప్పవలసింది చెప్పడమయిన తరువాత అవకాశంవుంటే మీరుకూడా చెప్పుదురుగాని యిప్పుడు కూర్చోండి.

గిరి—పబ్లికుమీటింగులో పెద్దలేమిటి? పిన్నలేమిటి? యెవళ్ళు బాగాచెపితే వాళ్ళే పెద్దలు. మాకుపెద్దలతోనూ గిద్దలతోనూపనిలేదు. ముందుగామేము చెప్పేదే వినవలెను. మేమిప్పుడు చెప్పకపోతే యీ పెద్దలనేవాళ్ళంతా యేవేవోముందుగా నోటికివచ్చినట్లు మతిమాలిన మాటలు కొన్నిచెప్పి కాలంవృథాగా పాడుచేసి తరువాత మేము చెప్పేవి వినడానికి టైములేదంటారు.

సత్యా—అబ్బాయీ! కూర్చో. ఇలాన్యాయవిరుద్ధమైన మాటలు మాట్లాడుతూ వుంటే పిల్లవాళ్ళను అసలేమాట్లాడనియ్యను.

గిరి—నేనుకూర్చోను. నాకు వొకరి ఆజ్ఞయేమి? నన్నుమాట్లాడనియ్యడానికీ మాట్లాడనియ్యక పోవడానికీ యెవరికి అధికారంవున్నది? నేనుయిప్పుడు ముందుగా వుపన్యాసంచేస్తాను. యెవరు అడ్డంవస్తారో చూతాముగాదూ?

సత్యా—ఇనస్పెక్టరుగారూ మీరుకొంచెం యీపిల్లవాళ్ళు అల్లరి చెయ్యకుండా మీటింగుసాగేటట్లు చెయ్యవలెను.

గిరి—మాటలు బాగా రానియ్యండి. అల్లరీ గిల్లరీ అంటూ వున్నారు. ఈమాటు అటువంటిమాట మళ్ళీఅంటే యేమిచేస్తానో—

ఇన్—ఓయీ కనిస్టేబిల్! నీవు యీపిల్లవాణ్ని చెయ్యిపట్టుకొని అవతలికి పంపించివెయ్యి. పిల్లవాళ్ళు యెవరయినా అల్లరిచేసినారంటే మిమ్మలినందరినీ వీధిలోకి గెంటించివేస్తాను. జాగ్రత! వూరికే కూర్చుని వినండి.

గిరి—(తనలో) మనవాడనుకున్న పోలీసు యినస్పెక్టరే వాళ్ళల్లోచేరినాడే. నేను నోరుకసితీరేటట్టుగా వుపన్యాసం చెయ్యడానికి వల్లకానట్టువున్నది. అయినాకానీ ప్రియత్నంచేసిచూస్తాను. (బిగ్గరగా) నాజోలికి యెవరూరాకూడదు. న్యాయం చెయ్యడానికి యేర్పడ్డ పోలీసువాళ్ళే యిలా అన్యాయం—

ఇన్—చూస్తావేమి? ఆపిల్లవాణ్ని వీధులోకి యీడ్చుకొనిపో. వీధులోకూడా అల్లరిచేస్తే స్టేషనుకు తీసుకొనిపోయి నేనువచ్చినదాకా కొట్లోపెట్టు.

కని—చిత్తము. (అని గిరిరావును తీసికొనిపోవుచున్నాఁడు.)

విశే—పబ్లీకుమీటింగులో స్వేచ్ఛగా మాట్లాడడానికి అందరికీ స్వాతంత్రిం వుంటుంది. ఇలాచెయ్యడం యెంతమాత్రమూ ధర్మంకాదు. నేనీసంగతి వెంటనేపోలీసుసూపరింటెండెంటుగారికి తెలియచేస్తాను. ఇటువంటి దౌర్జన్యం జరిగిన యీమీటింగులో పెద్దమనిషి అయినవాడు యెవడూ వుండగూడదు. గణికా ప్రాణనాథరావుగారూ! రండి మనము లేచిపోదాము. (అని కోపముతో సభవిడిచి పోవుచున్నాఁడు.)

గణి—(తనలో) నేనుకూడా వెళితే యెదురుచెప్పేవాళ్ళు యెవరూలేకుండా వాళ్ళదే రామరాజ్యం అవుంది. కీరవాణితల్లి యింకా రాకుండా వున్నది. అదివచ్చి వీళ్ళ పదిమందిలోనూ దులిపివదిలిపెడితే వీళ్ళ మొఖాలకు సిగ్గువస్తుంది.

(తెరలో) మావంటి ఆడవాళ్ళ కొంపల్లోనున్న [illegible] ధర్మంకాదు.

నయ—ఎవరిదో స్త్రీకంఠం వినబడుతూవున్నది. అదుగో సగం నెరిసిన తలకు నల్లరంగు వేసుకొని పడుచు వేషంతో కీరవాణిశల్లి ముసలిది సభలోకే వస్తూవున్నది.

వివే—స్వాభావికమయిన అందం తగ్గడంతోటే పడుచులను మోసంచెయ్యడానికి కృత్రిమవేషం వేసుకోవలసివస్తుంది. అది యిక్కడి కెందుకు వస్తూవున్నదో!

[కీరవాణిశల్లి ప్రవేశించుచున్నది.]

కీర—అయ్యలారా! మీరు నేటికాలానికి మహోపద్రవము [illegible] పెట్టినారు. వినాశకాలానికి విపరీతబుద్ధులు పుడుతవి. ఆడవాళ్ళకొంపల్లో దుమ్ముపోసి వాళ్ళవుసురు పోసుకుంటే మీకు మంచికాదు. మీ పెద్దలు దేవతాకన్యలని మాకులంవారిని పూజచేసి మాకు మాన్యాలు దానం చేసేవారు. తమ కూతుళ్ళ పెళ్ళిళ్ళలో మంగళసూత్రం మేము తాకితేనే కాని పవిత్రంకాదని భావించేవారు. ఇట్టి మహాత్మ్యాలు కలవున్న పుట్టి ప్రపంచం పుట్టినప్పటినుంచీ వున్నటువంటిన్ని మీ [illegible] దేవతలనుగా భావించి పూజించవలసినటువంటిన్ని మావంటి సంఘపు కన్యలను భూమ్యా మాన్యాలూ యిచ్చి ఆదరించడానికి బదులుగా కూడువడకొట్టి మూలచ్ఛేదం చెయ్యడానికి దీక్షపట్టడంవల్ల మాకు మహాప్రతిష్ఠ వస్తూవున్నది.

సత్యా—ఈసభ పురుషులకోసం ఉద్దేశించబడ్డదిగాని బోగం వాళ్ళు వచ్చి దూషించడంకోసంగాదు. అమ్మా! నీవు వెళ్ళిపో.

కీర—వెళ్ళిపోవడానికి నేను పిలువకుండా రాలేదు. పెద్దమనుషులు రమ్మంటేనే వచ్చినాను.

గణి—పెద్దమనుష్యులు రమ్మనడంయెందుకు? నీఅంతట నీవే రావచ్చును. ఆపెద్దమనుష్యులకోర్టు యిక్కడచెప్పక నీవు చెప్పవలసిం దేమిటో సభవారితో నిర్భయంగా మనవిచేసుకో.

సత్య—ఇన్స్పెక్టరుగారూ! తమరు దాన్ని మాట్లాడకుండా బందోబస్తు చెయ్యవలెను.

రాజ—"దాన్ని" అని అగౌరవంగా మాట్లాడుతూ—

ఇన్స—ఓజవాన్! ఆభోగందాన్ని యీపిల్లవాణ్నికూడా అవతలికి పంపించివెయ్యి.

మాయా—నేనుయిందులో మధ్యస్థుణ్ని. యిందులోవాక్యన్యాయంవున్నది. మనం భోగంవృత్తికి భంగంకలగచెయ్యడానికి ప్రయత్నం చేస్తూవున్నాము గనుక వాళ్ళు చెప్పేదికూడా విని మరీ తీర్పు చెప్పడం న్యాయంకాని యేకపక్షివిమర్శమీద తీర్మానం చెయ్యడంన్యాయంకాదు. కాబట్టి కీరవాణితల్లి చెప్పేదంతావినడం నాఅభిమతం. తరువాత సభవారియిష్టం. నేను న్యాయంకోసం చెపుతూవున్నానుగాని యిందులో నాకుయేమీ సంబంధంలేదు.

సత్య—ఇది న్యాయసభకాదు. ఇక్కడ ప్లీడరీవాదాలతోనూ సాక్ష్యాలతోనూ కక్షిదార్లవివాదలతోనూ శాస్త్రాలతోనూ యేమీ పనిలేదు. జారవృత్తిలోవున్నవారిని మనయిళ్ళకుపిలవడంవల్ల నష్టాలు కలుగుతూవున్నవని తెలుసుకుని మనంబాగు పడడానికి తగినసాధనాలు ఆలోచించుకోవడానికి చేరినసభగాని యిది భోగంవాళ్ళతో వాదం చెయ్యడానికి యేర్పడ్డసభకాదు.

కీర—మీరుయింగ్లీషు చదువుకుని పెద్దపుద్యోగాలు సంపాదించి డబ్బుకోసం లోభించి యిటువంటి అకార్యాచరణానికి పూనుకుంటే మీరు అపకీర్తిపాలయిపోతారు. మాకులంనేడుపుట్టినదా? బ్రహ్మదేవుడు.—

సత్య—అయ్యో! ఇనస్పెక్టరుగారూ! మీరు ఆ మనిషిని ఖైదు కుండేటట్టు చెయ్యవలెను.

ఇన్—నీవు మీయింటికివెళ్ళిపో. నీవు యిక్కడవుంటేమర్యాద దక్కదు.

కీర—నేడుసభచేస్తారు రమ్మంటే వచ్చినానుగాని లేకపోతేరాక నేపోదును. మీరు యిటువంటిసభలు లక్షచేసినా మాయింటికివచ్చే మహారాజులు మాయింటికిరాకనూ పోరు; వారుమాకు యిచ్చేవి యివ్వకనూపోరు. ఈ యింగ్లీషు చదువుకున్న మహారాజులు కొందరు మీరుయిందరు యిన్ని వుపన్యాసాలు చేస్తూవున్నా తమ పెళ్ళాలను వదిలిపెట్టి చీకటిపడగానే ముసుగువేసుకుని మాయిళ్ళల్లోదూరి కానుకలు సమర్పించి మాకు దాసులయి సేవచేస్తూవున్నారు. మీఅరణ్యరోదనం వినేవారుయెవరు? (అని సభవిడిచి పోవుచున్నది.)

గణి—బహుబాగా చెప్పినది. ఆమెలోకమాతగాని వేశ్యమాత్రము కాదు. ఇటువంటిసభలోవుంటే పిల్లిమూలినవాళ్ళు వుంటారుగాని మానవంతుడు వుండడు. (అని దానివెంటబోవుచున్నాడు.)

వివే—వేశ్యాప్రియులు యిద్దరూ లేచిపోయినారు. యిక మన సభ సాగవచ్చును.

మాయా—కానియ్యండి. అంతావాళ్ళపక్షంగానే వుంటేబాగా వుండదని పయికి కొంచెమాటలన్నానుకాని హృదయంలో నేనూ మీలోచేరినవాణ్నే సుమండీ. నన్ను మీరు వేరేవిధంగా భావించకూడదు. ప్లీడరీవృత్తి భోగంవృత్తి వొక్కటేనూ వస్తువది. వేశ్యవిటుల వద్ద యెన్నిటక్కులు కనపరుస్తుందో ప్లీడరుకూడా డబ్బులాగడానికి పార్టీలవద్ద అన్నిటక్కులు కనపరచవలెను. ఇదివుద్యోగధర్మం.

వివే—మీరుచెప్పినది నిజం. మీరు ముందు ప్లీడరవుతారనే మా పెద్దలు మీకు మాయాచార్లుగారని సార్థకనామం పెట్టినారు.

పాడైపోతూవున్నది. మనం యీటింగు వేగిరం ముగించవలెను. సభలలో వేశ్యలుపాడేపాటలూ పట్టే అభినయాలూ, అన్నీ పడుచువాళ్ళను సన్మార్గాన్నుంచి తొలగించడానికి అనుకూలమయినవిగానే వుంటవి. ఇప్పుడా బోగంది చెప్పిపోయినట్టు యింగ్లీషు చదువుకున్నవాళ్ళుకూడా చీకటిపడ్డతరువాత వేశ్యలయింటిబంటులవుతూ వున్నారన్నప్పుడు, ఆనష్టాలు నేను ప్రత్యేకించి మీకు చెప్పవలసినవసరేలేదు? వేశ్యలవల్ల ధననష్టం కలుగుతుంది. వివాహాలలో మేళాలకింద వేలకొద్ది ఖర్చుచేసి కూటికి పేదలయినవారిని మీరెందరిని చూడడంలేదు. తమ పెద్దలార్జించిన భూములుకూడా వేశ్యలకువ్రాసియిచ్చి జోగులయినవారిని మీరు యెందరిని చూడడంలేదు? ధననష్టమేకాకుండా వేశ్యాప్రియులకు దేహముకూడా పాడవుతూవున్నది. సుఖరోగములవల్ల బాధపడుతూవున్నవారిని మీరెందరినో నిత్యమూ చూస్తూవుంటారుగదా? ఇందువల్ల అనేకులనడత పాడవుతూవున్నది. పెద్దలనుచూచి వాళ్ళ పిల్లలుకూడా పాడవుతూవున్నారు. అనేకులు నీతిహీనులైనవారయి తమ భార్యలకు మాత్రమేకాక యీశ్వరునికికూడా ద్రోహముచేసినవారవుతూవున్నారు. ధనాశచూపి వేశ్యలను ప్రోత్సాహంచెయ్యడం వివాహమాడి పతివ్రతలుకా తగిన వేశ్యలనుజారిణులనుగా చెయ్యడమౌటచేత వేశ్యలకుకూడా ద్రోహమే. వేశ్యావృత్తి లేకపోతే సంగీతం చెడిపోతుందని కొందరంటారు. వేశ్యావృత్తివల్లనే సంగీతం చెడిపోతూవున్నది. జారిణులవద్ద సంగీతంవుండడంచేత కులస్త్రీలని నీచంగాయెంచి సంగీతం నేర్చుకోకపోవడంవల్ల పురుషులు సంగీతానికాశపడి వేశ్యలయింటికి పోతూవుండడమూ వేశ్యలు సంగీతాన్ని పురుషులను తమవలలో పడవేసుకొనడానికి సాధనంగా చేసుకోవడమూ తటస్థమువుతూవున్నది. సర్వజనాదరణీయమయిన సంగీతం వేశ్యలపాలుకాక యీవల బడితే సంసారస్త్రీలు దానిని తమపాలుచేసుకొని భర్తలను సంతోషపెట్టి

గృహములు స్వర్గతుల్యములుగా చెయ్యడానికి దాన్ని వుపయోగిస్తాను. కాబట్టి వివాహాది శుభకార్యాలలో భోగంమేళాలను పిలిపించడం మానివేసి పురుషులచేత పాడించడానికి యీసభవారు రిజల్యూషన్ చెయ్యవలెనని నేను ప్రొపోజు చేస్తూవున్నాను.

నయ—నేను శకండు చేస్తూవున్నాను.

సత్య—అందరూ ఆమోదించినారా?

మాయా—సభవారందరూ ఆమోగిందినారు.

సత్య—సభవారందరూ యేకవాక్యంగా ఆమోదించినారని రిజల్యూషన్ వ్రాసినాను. ఇంకా చెయ్యవలసిన పనేమున్నది?

నయ—ఈసభవారిలో యెవ్వరున్ను శుభకార్యాలలో తమ యిళ్ళకు భోగంవాళ్ళను పిలవకుండా వుండడానికిన్ని భోగంమేళం వున్న చోటికి తాము వెళ్ళకుండా వుండడానికిన్ని మనబాలికలకు విద్యతో పాటు సంగీతంకూడా చెప్పించడానికిన్ని రిజల్యూషను చెయ్యవలెనని నేను ప్రొపోజుచేస్తూవున్నాను.

ఇన్—నేను శకండుచేస్తూవున్నాను.

సత్య—సభవారందరూ దీనికామోదించినారా?

మాయా—ఆమోదించినారు.

సత్య—ఈనిర్ణయంకూడా యేకవాక్యంగా నిశ్చయింపబడ్డట్టు వ్రాసినాను. ఇప్పటికేచాలా ప్రొద్దుపోతూవున్నది గనుక మీరుయేర్పరుచుకొన్న యీశ్లాఘ్య విషయమయి నేను విస్తరించిచెప్ప తలుచుకోలేదు. మీరు యీ గ్రామములోనే కాకుండా యితరగ్రామములలో కూడా సభలుచేసి వేశ్యావృత్తివల్లకలిగే నష్టాలు జనులకు బోధపరిచిన్ని, వుపన్యాసాలుచేసిన్ని, చిన్నగ్రంథములు ప్రచురపరిచిన్ని, వృత్తాంతపత్రికలకు వ్రాసిన్ని, సాధ్యమయినంతవరకు యీదురాచారమును

మాన్పించడానికి ప్రయత్నం చేస్తారని నమ్ముతూవున్నాను. ఈశ్వరుడు మీకు మంచిబుద్ధిని పుట్టించి మీకు తోడగునుగాక? ఇంతటితో సభ చాలింతాము.

వివే—అగ్రాసనాసీనులుగారికి సభవారివందనములు సమర్పిస్తూ వున్నాను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

౨. రంగము—దంభాచార్యులవారి యిల్లు.

[దంభాచార్యులును, మాయాచార్యులును, చారుమతియు, ప్రవేశించుచున్నారు.]

దంభా—ఆడదానిమాట విని గణికా ప్రాణనాధరావుగారికి మాటయిచ్చి యెలాతప్పిపోనండీ? మాయాచార్ల బావగారూ! ఇందులో మీరు న్యాయం సెలవియ్యండి. పెద్దమనిషి భోగంమేళంకూడా వూరికే పంపిస్తానన్నాడుగదా!

చారు—మేళం పూరికే రావడంతోటే మహావైకుంఠంవచ్చి మనవాళ్లో పడ్డదానేమిటి? అన్నయ్యా! చూచినారా? మీ బావగారు పెళ్ళికొడుకు లేకపోయినాసరే భోగంమేళంవుంటే చాలునంటారు. జ్ఞానాచార్యులుగారు పెళ్ళిలో భోగంమేళం పెట్టేటట్టయితే తమ కొమారుడికి చిన్నమ్మను చేసుకోమని కూడాగా వర్తమానం పంపించినారు. తీరా కుదిరినసంబంధం చెడిపోతే మళ్ళీ మంచిసంబంధంరాదు. జ్ఞానాచార్లగారి కొమారుడు బీయేపరీక్షకు చదువుకుంటూవున్నాడు. మంచిబుద్ధిమంతుడు. పిల్లదానిరూపమున్ను చదువున్ను బుద్ధిన్ని చూచి

పిల్లవాడు తాను మనఅమ్మాయినే కాని మరియెవరినీ పెళ్ళిచేసుకో నంటే జ్ఞానాచార్యులుగారు మన సంబంధానికి వొప్పుకున్నారుగాని మనకు మాన్యాలూ మడులూవున్నవనీ మనంకట్నాలూ కానుకలూ పెడుతా మనీ ఆశపడి మనసంబంధంకోరలేదు. భాగ్యవంతులు వారికి కట్నా లిచ్చి పిల్లనిస్తామని ఎంతమంది తిరుగుతూవున్నారు. గణికా ప్రాణనాథ రావుగారేమో భోగంమేళము పెట్టడానికి వియ్యాలవారు వొప్పుకోక పోయినట్టయితే వారి సంబంధం చేసుకోవద్దని యీయనతో చెప్పి నారట! ఆయనమాటలు పట్టుకొని మీ వెఱ్ఱిబావగారు మంచిదని తల వూపినారట? ఈవింత చూచినారా! మీరు కాస్త కూకలువెయ్యండి.

మాయా——బావగారూ? ఆడవాళ్ళకు అంతయిష్టంగావున్నది గనుక సిద్ధమయిన సంబంధం వదులుకోవడం మంచిదికాదు. మేళంలేక పోతే మానెనుగాని మీపిల్లను తప్పకుండా జ్ఞానాచార్యులుగారి కుమారు డికే యివ్వండి. చిన్నవాడుబహుబుద్ధిమంతుడు.

దంభా——పిల్లవాడేమి బుద్ధిమంతుడు? ఇదంతా పిల్లవాడి మూలంగానే వచ్చింది. పిల్లవాడు పట్టుపట్టకపోతే మేజువాణికి జ్ఞానాచా ర్యులుగారు యెలాగయినా వప్పుకుందురు. మొన్నజరిగిన మీటింగులో వివేకరావుగారి దుర్బోధచేత తాను యికముందు భోగంమేళం చూడ నని ఆచిన్నవాడేమో కాగితంమీద దస్కతుచేసివచ్చినాడట! మనం పెద్దమనుష్యులం యింతమందివుండగా యెవరిమాటా లక్ష్యంలేకుండా మనకళ్ళయెదురపుట్టిన మొన్నటిపిల్లవాడు పంతంపడితే, పిల్లవాడికి బుద్ధి చెప్పి అవమానించక వాడిపంతం నెగ్గించి పెద్దమనిషి గణికాప్రాణ నాథరావుగారి మాట పోటు చెయ్యడం మీకుకూడా ధర్మమనే తోచిందా?

మాయా——ధర్మానికేమి? అన్నీధర్మాలే. మనం ముందుకా ర్యం చెడకుండావుండే సాధనం చూచుకోవలెను. గణికాప్రాణనాథరావు

గారి మాటా చెల్లించినట్టున్ను పిల్లవాడిమాటా చెల్లించినట్టున్నూ వుండే వుపాయం నేనువొకటి ఆలోచించినాను. ఆలా చేస్తే వుభయులున్ను సమాధానపడుతారు. పెళ్ళిలో మేళంమాన్పించి పిల్లవాడిమనసు సమాధానపెట్టండి. పెళ్ళిఅయినతరువాత వూరికే పంపించినన్నాళ్లు ప్రతిరోజూ మీ యింట్లో మేళంపెట్టి గణికాప్రాణనాథరావుగారి మనసు సమాధానపెట్టండి.

చారు—అన్నయ్యచెప్పిన ఆలోచన బాగావున్నది.

దంభా—నాకూ బాగానేవున్నట్టున్నది. ఏదో ముక్కు బద్దలయ్యేటట్టు మహాచెడ్డ పరిమళంవస్తూవున్నది. అరుగో గణికా ప్రాణనాథరావుగారున్ను విటేంద్రరావుగారున్ను దయచేస్తూవున్నారు.

మాయా—వారిరాక తెలియపరచడానికి వారివద్దనుంచి యీ పరిమళం గ్రహించి ముందుగా వాయుదేవుడు దూతగావచ్చినాడు. ఈసువాసనయొక్క మోస్తరుచూస్తే యిది యెక్కడిదో పశ్చిమ ఖండంనుంచి సీసాలలో దిగుమతీఅయిన అమూల్యపరిమళంగా తోస్తూవున్నదిగాని మనదేశపుదిగా తోచడంలేదు.

దంభా—వారు వచ్చినారు వూరుకోండి.

[గణికా ప్రాణనాథరావుగారును విటేంద్రరావుగారును ప్రవేశించుచున్నారు.]

దంభా—అయ్యా! తమరు యింతరాత్రివేళ దయచేసినారేమి? దయచెయ్యండి.

గణి—ఇంతకుముందే తృప్తిగా పెరుమాళ్ళసేవ చేసినాము.

మాయా—(తనలో) పానోత్సవం చేసినారుకాబోలును. ఈ సంగతి మీరు చెప్పనక్కరలేకుండా మీసువాసనే చెప్తూవున్నది. (బిగ్గరగా) పెరుమాళ్ళసేవ చేసినారేమి?

గణి—అహహాహా! మీరెవరూ? మంజువాణిగారా! మేము పెరుమాళ్ళసేవచేసినా మంచి తెలివితో వున్నాము. అహాహాహాహా!

విటే—గణికాప్రాణనాధరావుగారు పరియాచక మాడుతూ వున్నారు. మాతో యిన్నిమాటలూ తీరాసభలోకిపోయి వాళ్ళపక్షం చేరడంచేత మీకుమగతనంలేదని మిమ్మల్ని ఆడదాన్నిగా కట్టి పరిహాసంచేసినారు. గణికాప్రాణనాధరావుగారూ! మాయాచార్లగారిని మీరుబాగా పరిహాసం చేసినారు.

గణి—ఆహాహాహాహా! మీరెవరు? ఓహోహో! కీరవాణి తల్లిగారా? మీ మీసాలుచూడడంతోటే ఆనవాలు పట్టినాను.

విటే—(తనలో) ఈయనకు యిల్లుబయలు దేరినప్పుడు యింత మత్తులేదు. యింతలోనే స్మృహతప్పిపోయినది. వొళ్ళుతూలుతూ వున్నది; కళ్ళుతిరుగుతూవున్నవి. ఈయనను కొంచెంసేపు వూరుకుండేటట్టుచేసి నేనుమాట్లాడుతాను. (బిగ్గరగా) మాయాచార్లగారు యెదటి పార్టీలో చేరడంచేతనూ దంభాచార్లగారు భోగంమేళంలేకుండా పెళ్ళి చెయ్యడానికి వొప్పుకోవడంచేతనూ కోపావేశంచేత వొళ్ళు తెలియక యీయన యేమేమో అంటూవున్నారు. గణికాప్రాణనాధరావుగారూ! మీరుకొంచెంసేపు శాంతించండి. మీరుచెప్పమన్న మాటలన్నీ నేను వీరితో మనవిచేస్తాను.

గణి—అహహాహాహా! అవును. మాతండ్రిగారు నాకంటె చిన్నవారు. ఎవరు కాదంటారో కాదనండి.

విటే—గణికా ప్రాణనాధరావుగారు బహుబుద్ధిమంతులు. తండ్రిగారు యేళ్ళచేత పెద్దలయినా బుద్ధిచేత తమకంటె చిన్నలేనని యీయన అభిప్రాయము. ఈయన మాటలలో యెంతగూఢార్థమున్నదో చిత్తగించినారా? సాధారణులకడుపునకూడా గొప్పవారు

పుతారు. ఈయనతండ్రిగారికి భోగంవాళ్ళంటే యిష్టంలేదట! అందు చేత వేళ్ళుగడిచినా, ఆయనను చిన్నవాడనే చెప్పవలెను. అయ్యా! దంభాచార్లగారూ! నేనొక్కమాట చెపుతానువినండి. మాయాచార్లు గారు శతృకోటిలో చేరిపోయినారు గనుక శతృపక్షం వారిమాటా ఆడవాళ్ళమాటా మీరు యెంతమాత్రమూ వినక పెళ్ళిలో భోగం మేళం తప్పకుండాపెట్టి గణికా ప్రాణనాధరావుగారితో చేసినశపథం నిలుపుకోండి. పెద్దమనుష్యులతో అన్నమాట తిరుగరాదు. ముష్టి సంబంధం యీసంబంధం తప్పిపోతే నేను రేపు యీపాటికి మీచిన్న దానికి యింతకంటె మంచిసంబంధం తీసకువస్తాను. సందేహించకండి. ధైర్యం తెచ్చుకోండి. ధైర్యం పురుషలక్షణం. మీరు ఇందులో మాట తప్పిపోతే గణికా ప్రాణనాధరావుగారు మిమ్మలినికూడా ఆడదానికింద కట్టివేస్తారు.

గణి—ఆహాహాహాహా! శ్రీకృష్ణులవారిచెల్లెలు రంభవస్తుందట నేను కైలాసానికి వెళుతాను. (అని వీధిలోనికి పరుగెత్తుచున్నాఁడు.)

విటే—అయ్యా! దంభాచార్లుగారూ! మీరు మాటతప్పిపోవ డంచేత యీయనకు యెటువంటి అవస్థపట్టినదో చూచినారా? మీరు పెళ్ళిలో భోగంమేళం పెడతామని ఖరారుచేస్తేనేకాని యీయన మనసు కుదుటపడదు. ఆడవాళ్ళమాటవిని మీరు మరివొకలాగుచేస్తే నరహత్యాదోషం వచ్చి మిమ్మల్ని చుట్టుకుంటుంది. గణికా ప్రాణనాధ రావుగారు మీమీద కోపంవచ్చి మీతో చెప్పకుండా పరుగెత్తుతూ వున్నారు. నేనుకూడా యిప్పుడు ఆయనతో వెళ్ళి మెల్లిగా తెల్లవారే లోగా కోపంపోగొట్టి వుదయాన్న మేము యిద్దరమూ మళ్ళీవస్తాము. (అని వెళ్ళుచున్నాఁడు.)

మాయా—ఈతాగుబోతులు వదిలిపోయినారు. తప్పతాగి వాళ్ళు తెలియక మనమీదపడి కొట్టకుండా వీధిలోకి పారిపోయినారు.

మనం బ్రతికినాము. దంభాచార్లుగారూ! యీ పెద్దమనుష్యులను యెప్పుడూ మనయింటికి రానియ్యకండి. యెంతతాగినా విశేందర్రావు మాత్రము తెలివిగానేవున్నాడు.

వంభా—ఆయన యెప్పుడూ తెలివిగలిగేవుంటాడు. బంధువులు మీరు యింతగా చెప్తూవున్నారుగనుక పెళ్ళిలో బోగంమేళం మానివేస్తాను. గణికా ప్రాణనాధరావుగారు వూరికేపంపిస్తే తరువాత గృహప్రవేశానికి మేళంపెట్టి వూళ్ళో పెద్దమనుషుల నలుగురినీ తాంబూలానికి పిలుస్తాను. ప్రొద్దుపోతూవున్నది. వెళ్ళి పడుకుందాము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## ఉ ప సం హా ర ము.

నేనీప్రహసనముయొక్క యుపోద్ఘాతమునందు నాప్రహసనములు చదివెడివారలందఱును వానియందలి పాత్రములయందు వర్ణింపఁబడినగుణములు కొన్ని తమయందుండుటనుబట్టి తమ్ముద్దేశించియే యవి వ్రాయఁబడినవని యెంచుకోవలదని ప్రార్థించినను, అ, ఇ, ఉ, ఋ, అను దుష్టచతుష్టయ మొకచోటఁజేరి రహస్యముగాఁ దమలోఁ దామిట్లనుకొనిరని తాను చాటుననుండి విన్నదానిని హాస్యప్రియుఁడిట్లు వినిపించుచున్నాఁడు—

అ—వేశ్యాప్రియప్రహసనమంటే యేమిటి?

ఇ—వేశ్యలయం దిష్టముగలవారిని గురించిన ప్రహసనమని వాళ్ళ అభిప్రాయము.

ఉ—వాళ్ళ అభిప్రాయం నేడిసినట్లేవున్నది. నేను వాళ్ళకే తగిలేటట్టు దీనికి అర్థంచేస్తానుచూడు. వేశ్యాప్రియ ప్రహసనమంటే, వేశ్యలకు ప్రియమయిన ప్రహసనమని వొకఅర్థము.

ఋ—యీఅర్థాలకేమిగాని అందులోవున్న పాత్రలు యెవరిని గురించి వుద్దేశించబడినవో బుద్ధిమంతులు మీరు వూహించండి.

అ—గణికా ప్రాణనాథరావని నన్నుద్దేశించి వ్రాసివుంటారు.

ఋ—అందుకుసందేహమేమి? ఆపేరులో మొదటి అక్షరము లోనే గామీద అకారము పెట్టినారు కనిపెట్టినావు కావా?

ఇ—అలాగయితే విటేంద్రరావంటే నేనయివుంటాను. మొదట వీలో ఇకారమువున్నది.

ఋ—బాగావూహచేసినావు. వాళ్ళు యెంతతంత్రం చేసినారో కనిపెట్టినావా? అన్నీ మొదటిఅక్షరాలే పెడితే మనం తెలుసుకుపోతా మని, ఉకారము దంభాచార్యులలో నాలుగోఅక్షరంలో పెట్టినారు.

ఉ—ఓహో! యిప్పుడు బోధపడ్డది. దంభాచార్యులంటే నేనని వాళ్ళవుద్దేశముసుమా!

అ—నాకు యిప్పుడిప్పుడు వొక్కొక్కసంగతే బోధపడుతూ వున్నది. గణికా ప్రాణనాథరావు వేశ్యాభివాసంచేత పనిమానుకుని యింట్లోకూర్చున్నాడని వ్రాసినారు. ఈసంగతి యిప్పుడు నేను సంవత్స రమునుంచి సెలవుపుచ్చుకుని ఇంట్లోవుండడం మనసులోవుంచుకొని వ్రాసినారు.

ఋ—అది ఒక్కటేకాదు. మీరు పయికి వొప్పుకోరుకాని మీరు యెప్పుడు భోగంవాళ్ళతో ప్రొద్దుపుచ్చుతూ వుండడం ముఖ్యంగా మనసులోవుంచుకుని మిమ్మల్ని ఆక్షేపించడానికి—

ఇ—వూరుకోండి. హాస్యప్రియుడు పోంచుండి మనమాటలు వింటూవున్నాడు. మనం లోపలికిపోయి మాట్లాడుకుందామురండి. (నలుగురును లేచిపోవుచున్నారు.)

---

మోడరన్ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

| | | |
|---|---|---|
| 5 | రసికజనమనోరంజనము | 0 6 0 |
| 6 | శుద్ధాంధ్రభారత సంగ్రహము | 0 6 0 |
| 7 | అభాగ్యోపాఖ్యానము | 0 2 0 |
| 8 | పథికవిలాసము | 0 4 0 |
| 9 | జాన్ గిల్పిన్ | 0 1 0 |
| 10 | నీతిదీపిక | 0 2 0 |

## స్త్రీల కుపయోగించు కథలు

| అయిదవ సంపుటము | | 3 0 0 |
|---|---|---|
| 1 | సత్యవతీచరిత్ర | 0 4 0 |
| 2 | చంద్రమతీచరిత్ర | 0 4 0 |
| 3 | సత్యసంజీవిని | 0 4 0 |
| 4 | చమత్కారరత్నావళి | 0 2 0 |
| 5 | సతీమణివిజయము | 0 2 0 |
| 6 | సుమిత్రచరిత్రము | 0 2 0 |
| 7 | రఘుదేవరాజీయము | 0 2 6 |
| 8 | కురంగేశ్వరవర్తక చరిత్రము | 0 2 0 |
| 9 | కళావతీపరిణయము | 0 2 0 |
| 10 | గయ్యాళినిసాధుచేయుట | 0 2 0 |
| 11 | చిత్రకేతు చరిత్రము | 0 4 0 |
| 12 | దానకేసరీవిలాసము | 0 2 0 |
| 13 | వైదర్భీవిలాసము | 0 2 0 |
| 14 | భానుమతీకళ్యాణము | 0 2 0 |
| 15 | సరసిజనమనోభిరామము | 0 2 0 |
| 16 | ధర్మకవచోపాఖ్యానము | 0 2 0 |
| 17 | కుమారద్వయవిలాసము | 0 2 0 |
| 18 | పద్మినీప్రభాకరము | 0 2 0 |
| 19 | మాలతీమధుకరము | 0 2 0 |

## స్త్రీలకుపయోగించు పుస్తకములు

| ఆఱవ సంపుటము | | 3 0 0 |
|---|---|---|
| 1 | శ్రీవిక్టోరియామహారాజ్ఞీ చరిత్రము | 0 12 0 |
| 2 | సతీహితబోధిని | 0 8 0 |
| 3 | పత్నీహితసూచని | 0 6 0 |
| 4 | స్త్రీనీతిదీపిక | 0 2 0 |
| 5 | సత్యాద్రౌపదీసంవాదము మాతృపూజ పితృపూజ | 0 1 0 |
| 6 | నీతికథామంజరి ప్ర॥ భాగము | 0 8 0 |
| 7 | డిటో ద్వి॥ భాగము | 0 8 0 |
| 8 | దేహారోగ్యధర్మబోధిని | 0 5 0 |

## ఉపన్యాసములు

| ఏడవ సంపుటము | | 3 0 0 |
|---|---|---|
| 1 | జన్మాంతరము | 0 2 6 |
| 2 | అతిబాల్యవివాహము | 0 1 6 |
| 3 | విగ్రహారాధనము | 0 2 6 |
| 4 | ఈశ్వరకర్తృపుస్తకములు | 0 1 0 |
| 5 | ఈశ్వరోపాసనము | 0 1 0 |
| 6 | ప్రార్థన | 0 1 0 |
| 7 | మానుషధర్మము | 0 2 0 |
| 8 | విద్యార్థులధర్మములు | 0 2 0 |
| 9 | మనుష్యజీవితముల యొక్క పరమార్థము | 0 2 0 |
| 10 | వైరాగ్యము | 0 1 6 |
| 11 | విద్యాధురీణుల యుక్తకృత్యములు | 0 2 0 |
| 12 | వర్ణము | 0 3 0 |
| 13 | హిందూమతములు | 0 1 6 |

| | | |
|---|---|---|
| 14 | స్వయంకృషి | 0 1 6 |
| 15 | సకాయకష్టకర్మలు | 0 1 6 |
| 16 | వేశ్యాకాంతల యుప॥ | 0 2 0 |
| 17 | ఏకమత్యము | 0 1 0 |
| 18 | దానములు | 0 1 0 |
| 19 | స్త్రీపునర్వివాహచరిత్రం | 0 1 0 |
| 20 | స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము | 0 2 0 |
| 21 | స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము | 0 2 0 |
| 22 | స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము | 0 2 0 |
| 23 | స్త్రీపునర్వివాహశాస్త్రసంగ్రహము | 0 3 0 |
| 24 | స్త్రీపునర్వివాహభూతేనర్త మానస్థితులు | 0 1 0 |

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము 3 0 0

| | | |
|---|---|---|
| 1 | దేశీయమహాసభ, దానియుద్దేశము | 0 4 0 |
| 2 | శంకరాచార్యులు | 0 1 0 |
| 3 | ఒసవరాజు గనరాజుగారి జీవచరిత్రము | 0 2 0 |
| 4 | జీసస్ చరిత్రము | 0 10 0 |
| 5 | స్వదేశసంస్థాన చరిత్రాంశములు | 0 11 0 |
| 6 | విగ్రహతంత్రవిమర్శనము | 0 6 0 |
| 7 | ఉపన్యాసమంజరి | 0 5 0 |
| 8 | వివేకవర్ధని మొ॥భా | 0 6 0 |
| 9 | ,, రెం॥భా | 0 6 0 |
| 10 | ,, మూ॥భా | 0 8 0 |

సాహిత్యగ్రంథములు

తొమ్మిదవ సంపుటము 3 0 0

| | | |
|---|---|---|
| 1 | సంగ్రహవ్యాకరణము | 1 0 0 |
| 2 | కావ్యసంగ్రహము | 0 1 0 |
| 3 | అలంకారసంగ్రహము | 0 4 0 |
| 4 | నీతిచంద్రిక-విగ్రహము | 0 12 0 |
| 5 | నీతిచంద్రిక-సంధి | 0 12 0 |
| 6 | తర్కసంగ్రహము | 0 1 0 |
| 7 | సత్యవాదిని | 0 6 0 |
| 8 | ఉత్తమస్త్రీచరిత్రములు | 0 12 0 |

పూర్వాంధ్రకవులు

పదియవ సంపుటము 4 0 0

ఆధునికాంధ్రకవులు 1 4 0

శాస్త్రములు

శారీరశాస్త్రసంగ్రహము 1 0 0

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర 4 0 0

N B పై గ్రంథములన్నియు వాల్యూములుగాను విడిగాను కూడ దొరకును.

పుస్తకములు వలయువారు:—

# కార్యదర్శి, హితకారిణీ సమాజము.

రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.